శ్రీరస్తు.

స్త్రీల కత్యంతోపయోగంబుగ
ప్రాచీన కవి పుంగవులచే
రచియింపఁబడిన

# శ్రీకృష్ణుని చల్దులు.
# గుమ్మడు పాట.

27 JAN. 10
... MADRAS

ఇయ్యవి
పోతాప్రగడ వేంకటరత్నమ్మగారిచే
విశాఖపట్టణమందు
శ్రీశారదామకుట ముద్రాక్షరశాలలో
ముద్రింపించి ప్రకటింపఁబడియె.

వెల 1 అణా.

VIZAGAPATAM:
Printed by A. Venkatareddy, at the S. S. M. Press.
1897.



శు భ మ స్తు.

## గు మ్మ డు పా ట.

సీ॥ రాణించు ముత్యాల రావిరేకయు బొట్టుగాఁగా వెంట్రుకలునడుమ గొనిసియాడ। బాగైనముత్యాల పాపిటకమ్మల జోడు చెక్కిళ్లపై మెరుగు సేయుచుండ। వక్షస్థలంబున వరుసపతకములు రెండు నొప్పుగా తమలోన నొప్పుచుండ। రంగారు బంగారు రశనాకలాపంబు వసియాడునడుమున పసలుచూప॥ మేటి పటుతాడు కవ్వమున మించజుట్టి। వల్లెవాటున కొంగులుయ్యాలలూగ। కరములను కంకణంబుల రవము సెలగ। తరుణి యొయ్యారమున పెరుగు తరచుచుండె॥

ఘుమ్మ ఘుమ్మున పెరుగు తరచగ కోరివిని ప్రార్థించి కృష్ణుడు। అమ్మ వెన్నాయనుచు కవ్వము నణచిపట్టగనూ। నమ్మరా కృష్ణమ్మ పెరుగులో నడుమ గుమ్మడు తిరుగులాడును। నమ్మకున్నను ఘుమ్మఘుమ్మను నాదమిటువినుమీ। కృష్ణా గుమ్మడిదుగో॥

వామహస్తమునణచి పాదము వసుధలోపల కాలుమెత్తుచు। భామినడవగ నవయవమ్ములు బొజ్జగదలగను। కోమలీకంబైన చెక్కిలిని గునిసియాడెటి నడుమువంచుచు। ప్రేమ లెన్నుచు చేయి చాచెను పెరుగుతెరచగనూ। కృష్ణా గుమ్మడిదుగో॥

కాటబోయిన వారిపాపడు కడవలోపల చెయ్యిముంచెను। తాటుబోడచీ కరచెగుమ్మడు తొలగిపోవగనూ। మాటలేటికి ప

డువు కవ్వము అన్న నీకును వెన్నబెట్టెద। యేటికి యిందున్న గుమ్మడు యెగిరి కరచెడినీ। కృష్ణా గుమ్మడిదుగో॥

గుమ్మడేడే గోపిదేవీ। గుమ్మడేడే కన్నతల్లీ। గుమ్మడిని బాపజూపపగదవే యమ్మగోపెమ్మా। అమ్మా గుమ్మడేడే॥

ముచ్చుతనమున వేదములుగొని తెచ్చి వెరచుచు జలధిలోపల। జొచ్చియున్నా వాని వెంబడి జొచ్చి జలనిధిలో। మత్స్యమై సోమకుని దునిమించితి మగుడ చదువులు బ్రహ్మకిచ్చితి। ఆక్షణంబున గుమ్మడని యెడిమాట నేనెరుగా॥ అమ్మా గుమ్మడేడే॥

సురలు నసురులు జలధి తరచగ సరగునను భూధరము క్రుంగను। అల్ల సురవరులెల్ల పొగడగ వారికిష్టముగా। గిరికి కుదురుగ కూర్మమయితిని క్రిందిలో కామంతు గుమ్మని। తరుచుగా నొకమాటికయినను తరుణి నేనెరుగా॥ అమ్మా గుమ్మడేడే॥

చారుభూమి చరాచరమ్ములు చంకబెట్టుకు హేమనేత్రుడు। వారినిధిలో దొచ్చినంతట వానివెనుతగిలి। కోరి వరాహ రూపమైతిని రక్కసుని రణభూమి జంపితి। వారిభూములలోను గుమ్మడి పేరు నేనెరుగా॥ అమ్మా గుమ్మడేడే॥

జగములన్నియు విష్ణుమయమని చదువ బాలుండిందుగలడని। పగగనను ధట్టించి స్తంభము పగలవేయగనూ। సగము మృగమై హేమకశ్యపు చంపి దానవసుతుని గాచితి। మగువరో యిందున్న గుమ్మడిమాట నేనెరుగా। అమ్మా గుమ్మడేడే॥

వడుక బ్రాహ్మణ వేషమున నేబలిని యడిగితి దానమిమ్మని। పుడమిలో మూడడుగు లిచ్చెను పొంగి వేడుకతో। అడుగులను బ్రహ్మాం

డభాండములన్నియును నేనతృదునింతిరి। అడుగుక్రిందను గుమ్మడన గను అరసి నేనెరుగా। అమ్మా గుమ్మ డే డే॥

వరుసలెరుగక కార్తవీర్యుడువచ్చి యాసురధేనుకై వడి। ప రగ నా జమదగ్నిజంపిన పగకు నేనపుడూ। వరుస నిరువది యొక్క మారులు వెంటబడి భూపతులజంపితి। కోరిభూములలోన గుమ్మ డిపేరు నేనెరుగా॥ అమ్మా గుమ్మ డే డే॥

పరగగా రాక్షసులబాధకు విబుధదేవతలెల్లశరణని। కోర దశ రధరాజసుతునై యవని జన్మించీ। జలధిబంధనజేసి రావణుజంపితి ని రణభూమిలోపల। బలిమిగల యీగుమ్మడనియెడిమాట నేనెరు గా। అమ్మా గుమ్మ డే డే॥

సంతతమ్మును రామకృష్ణులు సదయులై రేపల్లెవాడలా। యింతులకు పదియారువేలకు నిష్టమొనరించీ। కుంతిసుతునకు సార థైతిని కురుకులంబులనణచుచోటను। మంతరమ్మున గుమ్మడనియెడి మాట నేనెరుగా॥ అమ్మా గుమ్మ డే డే॥

యుద్ధయోగము చేయుచోటను పణతులను చెరపంగవలెనని। వృద్ధబ్రాహ్మణువేషమున నేవేడ్కలమరగనూ। యుద్ధమున రాక్ష సులజంపితి యుప్పతిల్లగ భూమిదెప్పితి। యుద్ధయోగమునందు గు మ్మడిచోద్యమేనెరుగా॥ అమ్మా గుమ్మ డే డే॥

మర్మమెరుగక కలియుగమ్మున శత్రులై నీచులనుమించిరి। నిర్మ లాశ్వమునెక్కి వారల నణచి మోదమునా। ధర్మదేవతలనెడి రాజు ల ధరణిలో నిలపంగవెడలితి। ధర్మయుద్ధములోన గుమ్మడి తెరవు నేనెరుగా। అమ్మా గుమ్మ డే డే॥

మేదినియు మిన్నొక్కటగుచు మెండుజలముల దిశలు ములు
గగ। మోదమలరగ నుండితిని నేమొదటి రూపమునా। ఆదరమ్ము
న తిరిగియంతట నమ్మనే జగమెల్లనిండితి। వెదకితినిజగమెల్ల వేమరు -
గుమ్మడిని యెరుగా॥ అమ్మా గుమ్మడేడే॥

ఇందుగలడా గుమ్మడని యెద వెందుగలడో చూడుమాయని। వం
దనంబిడి వేగ తనతిగువాకు తెరచగనూ। నందనందను నోటిలోపల
నాతి పొడగనె చరాచరంబులు। చంద్రసూర్యులు మొదలుగాగల
సకలదేవతలన్॥

కన్నబలిమిని గుమ్మడంటిని కరుణజూడుమి దేవమణి నను। చిరు
తలను వెరపించుచందము చేస్తినో తండ్రీ। వెరువవలెనని గుమ్మడం
టిని వెరచితిని తిరువాకు మూయుము। కరుణతో హరిదాసునేలి
న కాకుళాధీశా॥

గుమ్మడు పాట సమాప్తము.





శుభమస్తు.

## శ్రీకృష్ణుని చల్దాలు-

సృష్టిలో వెలసీనట్టి- శ్రీవాశిష్ఠూ లెల్లాగోలువా- శ్రీకాంతునివల్లాభులకూ- శ్రీమహిమలువిస్తారింగ్రహూ। వేదూకో రండేపదములు- ఉభయాకారుండనిబాడా- కాళిందీ మదాఽనులకూ- ఘనమైనాకళ్యాణమ్మూ- పంచాశతకోటీయోజన- విస్తీర్ణామైన్యాపృథివీ- ఆత్మారక్షించా ఉదయామైతెరి। రాజీవాలోచానూలూ- చెన్నాగాగోపకమాళ్లూ- చేకోలలు చేతనుబట్టుకు- శ్రీకృష్ణుడుగోవులుగాయను- పోదామాప్రొద్దునలేచీ- అనివిన్నాపమ్ములు చేయగ- అచ్యుతులు మేలూగాంచ్రీ। అవధారింపుతు లేచీ- ఆనందామూనాపొంగే- త్రైలోక్యావల్లాభూలూ- తమతల్లితో ననిరేయిట్లూ। గోవులానూగాయాబోవలె- చాలాప్రొద్దామెనుమాకూ- అనుచూతనపట్టిలేపగ- ఆనం దామూనాగోపీ। అఖిలాండానాయాకులనూ- అంకిచీపిలచేతల్లి। సకలాకళ్యాణానిలయుడ-సకలాగూణాసీనూడా- పారంజ్యోతీతేజానిలయా- బల్లిదుడ మేలూకొనరో- శ్రీపారమ కళ్యాణూడా- సృష్టికీ కర్తావైనా- క్షీరాబ్ధి శయనూడైనా- తానాయుడ మేలూకొనరో। అనివరాదా శుభ నిలయూడా- ఆనందాసాగారూడా- ఇందిరానందాకరుడా- యదునందన మేలూకొనరో। గ్రిహమూ దాకీ కొలనా- గజరాజూమకరీచేతా- ఆర్తిచేగోలువాభక్తి- ఆలించీవిన్నాదేవా- పాంచాలీవలువలువేగా- దుశ్శాసనుడూ సభా నొలువా- అక్షాయము వలువలుయొసగిన- హారికృష్ణామేలూకొనరో। పూతాకీప్రాణా సంహార- మకల్లా

ఉదయూమైతెరి- క్షత్రీయూ వర్గము గెలచిన- పుత్రూడా మేలూకొన
రో।శశిధరూడూఅర్జూనూడూ-దిశలెల్లాదృంచీవేసి- ఆధారము లే
కాఅంతా- వృక్షమ్మునుండేనపుడు- కమలాలోచనులూ తమరు-
కరుణించాదలచీనపుడే-శరణాగతులారాజా మేలూకొనరో। మ
త్స్యావాతారామూనా- అచ్చూగాఅసురులజీరీ- చొచ్చీవేదమ్ము
లునిలపిన- వేదావేద్యుడ మేలూకొనరో- కూర్మావాతారామూ
నా- కొండ్రావీపూనాయానీ- అమరూలా కమృతంబొసగిన- కూ
ర్మావాతారుడలెమ్మీ। నట్టేడూసముద్రమ్ములు- ధరణీపైకలసీపార-
వసుధాకొమ్మునమెత్తిన-వరాహావాతారుడలెమ్మీ। అదరీరక్కసు
లాతమకూ- బెదర్చీస్తంభమ్మునవెడలీ- హిరణ్యాక్షునిజంపిన- నర
సింహావాతారుడలెమ్మీ। బాలాప్రాయమ్మున తమరూ- బలిచక్రావ
ర్తీనపుడూ- మూడూపాదమ్ములుయడిగిన- మురవైరుడమేలూకొ
నరో। హాలాయూధమ్మునయపుడూ- అన్నీతీర్థమ్ములుతిరిగీ- అవలీ
లాగానూవచ్చిన-బలరామావతారుడలెమ్మీ- ఖరవీరాబాహులువె
య్యీ- ఖడ్గమ్మునఖండించపుడూ- క్షత్రీయూవర్గము గెలచిన-పరశూ
రామావతారుడలెమ్మీ। వాలీమర్దానూడా- వారాధీ బంధానూ
డా- సుగ్రీవాహితుడావైనా- సూర్యావంశాజుడ మేలూకొనరో।
సేతూబంధానూడా- శ్రీలక్ష్మీవల్లాభూడా- రావాణావైరీవైనా-
ఘునందన మేలూకొనరో। గోపీనందానూడా-గోవర్ధానోద్ధారూ
డా- గోపీకాప్రాణావల్లభ- గోపాలుడ మేలూకొనరో। రుద్రూ
నికి త్రిపురాపురములు- వెగ్గాశామాయేనంత- ముగ్ధరాళ్లామా
నము గొన్నా- బుద్ధావా తారుడలెమ్మీ। కాళంగీ మర్దానూడా-
కౌస్తూభాహారముజేసీ- కలియూగాదుష్టులజంపిన- కలికావాతా
రుడలెమ్మీ। అనివరాదా శుభనిలయూడా- ఆనందాయోగానిద్రా
ఎప్పూడూమేలూకొంటిరి- పరోమీతో గోపకుమాళ్లూ- అనుచూ

తిరుబోనము దెరచీ-చల్లా రాబోసెను చల్దీ-దధిచాలా శొంఠీ వేసీ- మృ
దువూగా కలిపెను చల్దీ। ఓయమ్మా కలిపిన చల్దీ- ఒప్పొచిక్కాము
లోనుంచీ- మృదువైనా పచ్చళ్లన్నీ- చల్దిపైయుంచెను తల్లీ। వాకా
యా వద్దికాయా- ఒప్పైనా మారెడుగాయా- ఊరినా యల్లము
తోటీ- ఉసిరికాయొప్పుగనుంచీ)। చల్లించిన మిరియపుగెలలూ- జ
మ్మావుల పెరుగూతోనూ- అల్లమ్మూ ఆవాకాయా- అనేకములుంచె
నుతల్లీ। చెన్నా భావించీజూచీ- శ్రీపాదమ్ములు కడ్గీ- ముద్దూవ
ప్పూచూనున్నా- ముఖపద్మము యొనారించే- నారికేశ్వర కుంతా
ళములు- తలాదువ్వీ పాపిటదీసీ- గండూకొప్పు వొప్పుగముడిచే।
చామంతులు చంపాకమ్ములు- చంగల్వాలునదుమానుంచీ- అతివీరూ
లైనా మల్లెలు- అనేకాపుష్పములన్నీ ముడిచే। ఒప్పూగా కమలానే
త్రీ- ఉభయాభాస్కర తేజులకు- బాగూగా చందానమ్మూ- బలచం
దనమలదే మేనా। కడుయొప్పెటి పాదమ్ములకూ- గండూకడియమ్ము
లుబెట్టే- కనకంపూగజ్జెలుగట్టీ- ఘనమైనా తొడుగులుతొడిగే। మె
రుగూ మొలనూళ్లేగట్టీ- మేలైనా సొమ్ములుబెట్టీ- ముద్రికాదిఅంగుళ్య
మ్ములు- మురవైరీకొప్పాబెట్రీ। వజ్రాగోమేధిక పతకము- వైడూ
ర్యరత్నాఖచితా- సువర్ణాపతకము కృష్ణుని- కంఠమ్మునుంచే త
ల్లీ। పడులేనిపచ్చాపట్టూ- బాగూగా దిండీజుట్టీ- భమిడీకాతారీదో
పీ- ప్రభుడూ చేకోలలుబట్టే। ధుమకమ్మునకోలలుబట్టుకు- తొమ్మం
డూ)వెంటానడువా-బాగూగావల్లీజూచీ-బంగారముపొప్పేబిరు
దూ- ఒప్పీయానందముజూచీ- నందూనీసుతుడూ వెడలె- మందలీక్ష
కాతామనుచూ॥

శ్లో॥ గోపాలరత్నం భువనైకరత్నం గోపాంగనాయావన
భాగ్యరత్నం। శ్రీకృష్ణరత్నం సురమౌళి రత్నం భజామ
హే యాదవవంశరత్నం॥

కోవీలాలూ కూసెటిమోతా- కోడిపుంజులూ గూసెటిమోతా-
గోవ్రూలాహూతరిమెటిమోతా- కాంతాలూపాడేటిమోతా-

శ్లో॥ లక్ష్మీకళత్రంలలితాబ్జనేత్రం పూర్ణేందువక్త్రం పురుహూ
తమిత్రం। కారుణ్యపాత్రం కమనీయగాత్రం వందే పవి
త్రంవసుదేవపుత్రం॥

చిలుకాలూ పలికెటిమోతా- సద్గోవులు కొమ్ములమోతా- నెమ
ళ్లూఆర్చెటిమోతా- నెమళ్లూకూసెటిమోతా-

శ్లో॥ బాలాయ నీలవపుషే నవకింకిణీక జాలాభిరామ జఘనా
య దిగంబరాయ। శార్దూలదివ్యనఖ భూషణ భూషితా
య నందాత్మజాయ నవనీతముషే నమస్తే॥

నాల్గోఝామూమెను ప్రొద్దూ- నాధునీకీ విన్నాపమ్ములు- ప్రొద్దూ
న్నేకోళ్లు- పాలుపమరగ కూసెటిమోతా-

శ్లో॥ జానుభ్యామపిధావంతం పాదాభ్యామతిసుందరం। సకుం
డలాలకంకృష్ణం ధ్యాయామ్యుషసి బాలకం॥

అరవిందాగోపకుమాళ్ళూ- లక్షామెను బదివేలాకోట్లూ- మొత్తీ
మూడెత్తులమోతా- ఉభయాపార్శ్వములందూ-

శ్లో॥ సంపూర్ణచంద్రవదనం సరసీరుహాక్షం మాణిక్యకుండలధ
రంమకుటాభిరామం। చాంపేయగౌరవసనం శరచాపహ
స్తం శ్రీగోపబాలమనిశం మనసాస్మరామి॥

యేమీభాగ్యమ్ములుగలుగును- యీమందారాజ్యమువారికి- త్రైలో
క్యాదాతాపతకీ- తల్లియాశోదాదేవీ- సర్వేశ్వరుడుపట్టినవేణూ-
సంచారింపుచునేత్రము- శ్రీకార్యముతలచినమోతా- శతయోజా
నమ్ములవినుతా-

శ్లో॥ విదగ్ధగోపాల విలాసినీనాం సంభోగచిహ్నాంకితసర్వగా
త్రం। పవిత్రమామ్నాయగిరామగమ్యం బ్రహ్మప్రపద్యే న

వనితచోరం॥

అనుచున్నా దేవగణమ్ములు- గగనామార్గమ్ములయందూ- పుష్పమ్ము లవృష్టిగురిసెను- పుండారీకాక్షులమీదా-

శ్లో॥ కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం। వటస్యపత్రస్యపుటేశయానం బాలంముకుందం మనసా స్మరామి॥

యక్షాకిన్నారాగరుడా- గంధర్వావిద్యాపతుల్లు- తుంబురూలూ నారాదూలూ- స్తుతియించీమిమ్మునుగొల్వా-

శ్లో॥ విచిత్రపత్రాంకురశాలిబాలాస్తనాంతరం మానిమనోంతరంవా। అపాస్య బృందావనపాదపాస్యముపాస్య మన్యన్నవిలోకయామః॥

చంగల్వాగడ్డిమేసి- చెలగూచూగోధనమంతా- యిందీరాపాతీ వచ్చీ- మందల్లానడుమనునిలచే-

శ్లో॥ అహోభాగ్య మహోభాగ్యం నందగోపాల సంభవం। యేనిత్యమభిధ్యాయంతి పూర్వజన్మనిసంచితం॥

చిటిచిట్టీలేగాలన్నీ- చెవులూరికొరిరించీబూచుచు- చెలువునికీజేరగవచ్చీ- శ్రీవేణూనాదమ్ములకూ- చిక్కమ్మునచల్దిదించీ- చూక్కమ్మనవెండీవలెనూ- అగ్రిజూలూఅందీముద్దలు- అందందీవేయువారలకూ। అం వారూమనసారాగింతురు- అందింతురు చల్దిముద్దలు- ఒప్పైనాపచ్చళ్లన్నీ- అందందీవేయువారలకూ। ఒండొండూ పచ్చళ్లన్నీ- ఉంగా్రలూ మెడమాదోసుకు-పదులేనీపచ్చళ్లన్నీ- వేళ్లాణ్డుమా వేసువారలకూ।బాలాచంద్రూనీచుట్టూ- చాలాపరివేషము వలెనూ- గూడెదారూగోపాకుమారుల్నా- మేలూగానొప్పేభాక్తి॥

శ్లో॥ సజలజలదనీలం దర్శితోదారలీలంకరతలధృతశైలం వేణువాద్యైరసాలం। వ్రజజనకులపాలం కామినీకేళిలోలం క

లితలలితమాలం నౌమి గోపాలబాలః॥

పాిభాతా సమయామప్పుడు- భాస్కరు లుదయము శాయగ- బిహ్మాండా కోట్లూ వెలుగగ- ప్రభుదూవల్దా రాగించే। మౌనమ్మున ఆ రాగించీ- మదురూదూశ్రీహస్తమ్ములకూ- పన్నీరూఅవధారించె ను। త్రైిలోక్యావల్లాభూలూ- పచ్చీవీపోకలతోనూ-పండు తెల్లానాకులతోనూ-పచ్చాకర్పూరవువిడియము-పరమాత్ములుఅవధారించే॥

శ్లో॥ వల్లీప్రవాళనవపల్లవపాదపద్మంకంజేక్షణంజలదనీలసరోరుహాభం! సీమంతి నీనయన మోహన మూలమంత్రం కృష్ణంనమామి మునిమానస రాజహంసం॥

అమరేంద్రాంగనలూ రాకా-సంభవమువిమానారూఢూలై గ్రోవ గ- ఆలంకామధ్యంబూనా- భ్రమతాలై వారలుజూచితె- భ్రమతూలై పంచాశతకోటీ- విభ్రాంతూలై- కల్పావృక్షమ్ములనీడను- కదుతిన్నగమల్లీ జూచీ- కమలా నాభులు వేణూబట్టైను- కాంతల్లా చిత్తామమరా- మురహారీ గుజ్జరి పురమందున నోచిలుకా। పలికీ నామాధావుండూ- హేసాక్షీ భోజనగమనా- సావేరీభూపాళ మునా- సరసీజా శ్రీరాగా- సర్వంబున నాదముఖట్టైను- సనకాదులు అంజలిబట్టా॥

శ్లో॥ త్వయిప్రసన్నేమమకింగుణేన త్వయ్యప్రసన్నే మమకింగుణేన। రక్తేవిరక్తేచ వరేవధూనాం నిరర్థకః కుంకుమపత్రభంగః॥

సఖులూ తమ సుతులను విడచీ- సర్వేశ్వరునీ తగులుకు రాగా- సతులూ తమపతులనువిడచీ- సర్వేశ్వరునీ తగులుకు రాగా- అందారూ గొల్లలుగూడీ- ఆలోచనలూ సేయుచునుండ్రీ॥

శ్లో॥ మందంమందంమధురనినదైర్వేణునాపూరయంతం బృందంబృందావన భువిగవాంచారయంతం చరంతం। ఛందోభా

గేశతమఖముఖ ధ్వంసినాందానవానాం హంతారంతంక
ధయరసనే గోపకన్యాభుజంగం॥

పెద్దావాడందురుగొల్లా- పేదరికము తెలిపెనుకృష్ణుడూ- ప్రతివీసుం
దారీ నాసతినేనివ్వానని తాబలికే। పుండావాడందురుగొల్లా- పా
పంపూమాటాలాడా- సతినైనాయిచ్చేగానీ-చావంగానోపానని
నూ। చిక్కంపూపరుడోగొల్లా- బిరుదూపాటించీ జూచీ- సతిని
చ్చినకష్టముగంటే- చచ్చుందుట మేలనిబలికే। వివేకపరుడో గొ
ల్లా- వివరించీ తెలిపెద మీకూ- మనమెవ్వరు మనసతులెవ్వరు- మ
థురాపురికేగుదమనిరి। తల్లీదండ్రి కృష్ణుడు- దాతాదైవమెగురు
వు- అచ్యుతుడు మనకందరకూ- ఆత్మాబంధూడని బల్కికే। కస్తూ
రీవాకాక-చేల్కకన్నాలాకాటుకబెట్టీ- కస్తూరీవాక్కా-చెలియా-
కలయంగా బూసుకువచ్చే- వచ్చేనని వకచెలితానూ- అచ్చాగా
హారముతూలా- వచ్చేనని వకచెలిపేరులు- గుచ్చారావేసూకొను
చూ- కురులూ తూలగకుచములు గదలగ- కురువేణిఅమ్మలు గద
లగ- జలజాక్షీకృష్ణునిజూచీ- నిలువూ నిలువుమని తాబలికే॥

శ్లో॥ కస్తూరీతిలకంలలాటఫలకేవక్షస్థలేకౌస్తుభం నాసాగ్రేనవ
మౌక్తికంకరతలే వేణుంకరేకంకణం। సర్వాంగేహరిచం
దనంచకలయన్ కంఠేచముక్తావళీగోపస్త్రీపరివేష్టితోవిజ
యతే గోపాలచూడామణిః॥

కనుగీటుచుకృష్ణుడు నందన- వనమూలో పా ॰కేతెంచీ- కనకా
మండాపముమీదికి- కాంతాతెమ్మనితాబలికే॥

శ్లో॥ అంగనా మంగనామంతరే మాధవో మాధవం మాధవం
చాంతరేణాంగనా। ఇత్థమాకల్పితేమండలే మధ్యగస్సంజ.
గౌవేణునా దేవకీనందనః॥

శ్లో॥ మౌళి మాలా మిళన్మత్త భృంగీలతా భీతభీతప్రియా విభ్ర

మాలింగితః। ప్రస్తగోపీకుచాభోగసంమేళిత స్సంజగావే
ణునా దేవకీనందనః॥

శ్లో॥ కోకకాద్యతానేకపంకేరుహాలీనహంసావళీ హృద్యతా
హృద్యతా। కంసవంశాటవీదాహదావానల స్సంజగౌ వే
ణునా దేవకీనందనః॥

తెన్నీనీ దేవరయిదివక- రాధామనపూర్వాకన్నా- ఫలమూనాదో
-ళేనాసీ- పరుగ్గూనాచెలి సాపచ్చే॥

శ్లో॥ హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే హే
కంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ। హే
రామానుజ హేజగత్త్రయగురో హేపుండరీకాక్ష మాం
హేగోపీజననాథ పాలయపరం జానామినత్వాంవినా॥

శ్లో॥ రామంరత్నకిరీటకుండలధరం కేయూరహారాన్వితంసీతా
లంకృతవామభాగమతులం సింహాసనస్థంప్రభుం। సుగ్రీవా
దిసమస్తవానరయుతం సంసేవ్యమానంసదా విశ్వామిత్ర
పరాశరాదిమునిభి స్సంస్తూయమానంభజే॥

శ్లో॥ వామేభూమిసుతా పురస్తుహనుమా న్పశ్చాత్సుమిత్రాసు
తశ్శత్రుఘ్నోభరతశ్చపార్శ్వదళయో ర్వాయ్వాదికోణే
షుచ। సుగ్రీవశ్చవిభీషణశ్చ యువరాట్తారాసుతో జాంబ
వాన్మధ్యే నీలసరోజకోమలరుచిం రామంభజేశ్యామలం॥

శ్లో॥ అంతర్గృహే కృష్ణమవేక్ష్యచోరం బధ్వాకవాటం జననీగ
తైకా। ఉలూఖలే దామనిబద్ధమేనం తత్రాపిదృష్ట్వా స్తిమి
తాబభూవ॥

శ్లో॥ మందారమూలే మదనాభిరామం బింబాధరాపూరిత వే
ణునాదం। గోగోపగోపీజనమధ్యసంస్థం గోపంభజే గో
కులపూర్ణచంద్రం॥

వెన్నూడి వేణూ నాదము-పాడీనావిన్నా వారికి- సాయుజ్యాపదవీ గలదూ।సంసారాభీతీతొలగూ- విష్ణూలోకమ్మూ గలదూ- ప్రభాతాసమయామప్పుడు-భాస్కరూడూ రాగా- ప్రభునీచలికోలలు మహిమలు- జదివీనావిన్నా వారికి- సాయుజ్యాపదవీగలదూ- సంసారాభీతీతొలగూ -విష్ణూలోకమ్మూగలదూ॥

శ్రీ కృష్ణుని చల్దులు

సమాప్తము.

